

# హైందవ వివాహ పద్ధతి



హైందవుల వివాహ మంత్రముల లోని ముఖ్య విషయములను ఈ హైందవ వివాహ పద్ధతి అన్న 28 భాగాల సీరియల్ గా చెప్పే ప్రయత్నమిది.

## మొదటి భాగం

విషయ సూచిక

13. సప్తపది
14. ప్రధాన హోమములు
15. సన్నికల్లు
16. లాజ హోమము
17. ప్రవేశ హోమము.
18. వధువునకు సర్వాధిపత్యము.
19. స్థాలీపాకము.
20. అరుంధతీ దర్శనము.
21. శేష హోమము
22. సదస్యము.
23. నాక బలి
24. దండాడింపు
25. కుత్తుకంటు
26. వధూవరుల పరస్పర అవలోకనము
27. దంపతి తాంబూలములు, అప్పగింతలు.
28. ప్రమాణ గ్రంథములు

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి రెండవ భాగం

## వధూవరుల లక్షణములు

పరస్పరము ప్రేమపాత్రమగు దాంపత్యమును, దాని ఉపలబ్ధిని ధృడముగా నుండునట్లు చేయుటకు మన ఋషులు కొన్ని వివాహ విధులను, కట్టుబాట్లను ఏర్పరచినారు. గౌరవపురస్సరమైన మంత్రపూరకమైన ఆవిధులను, కట్టుబాట్లను అర్ధముచేసుకొని వ్యవహారించుట ఎంతయూ అభిలషణీయము.

వివాహమును పాణిగ్రహణము అని పిలుచుచున్నాము. వివాహమునందు వరుడు వధువు చేయి పట్టుకుని అగ్ని సమీపమునకు తీసుకొని వెళ్ళి అచ్చట ఏడు అడుగులు నడిపించి (సప్తపది) సఖ్యమును స్థిరపరచును. వివాహమునకు అంతకును ఈ సప్తపదికి ప్రాధాన్యమిచ్చుచున్నారు.

## యోగ్య వధూవర లక్షణములు:

వివాహము నిశ్చయము చేయదలచినచో వరుని లక్షణములను, వధువు లక్షణములను గమనించి నిశ్చయించుచున్నారు.

**వరుని లక్షణములు:** " *బంధుశీల లక్షణసంపన్న శ్శ్రుతవానరోగశ్చ* "

బంధువులు కలవాడును, మంచి గుణములు గలవాడును, సాముద్రిక శాస్త్రమున చెప్పబడిన శుభలక్షణములు కలవాడును, (పూర్వము వేదవేదాంగములు చదివినవాడని చెప్పారు) అపస్మార మొదలగు అసాధ్య రోగములు లేనివాడును వరుడుగానుండవలెనని చెప్పారు.

**వధువు లక్షణములు:** " *బంధుశీల లక్షణ సంపన్నామరోగా ముపయచ్ఛేత యస్యాం మనశ్చక్షుషోర్నిబంధః* "

అనగా " బంధువులు కలదియు, మంచి గుణములు, శుభలక్షణములు కలదియు, దుస్సాధ్య రోగములు లేనిదియు, వరునకు - ఏ కన్యను చూచిన మనస్సునకును,

కంటికిని ఆసక్తి కలుగునో అట్టి కన్యను వివాహము చేసికొనవలెను " అని చెప్పినారు.

వివాహము నిశ్చయించుటకు పూర్వము - వరుడుగాని, వరుని తల్లిగాని నలుగురు మిత్రులను పంపి - శ్రేష్ఠమార్గముల వరింపదగిన కన్యగురించి వెళ్ళండి, నాకును (వరునికి) కన్యకును సంయోగం కలుగుట ఇంద్రునికి కూడా సమ్మతమే. వధూవరులిద్దరును యాగమున సోమరసాత్మకమగు అన్నమును తనకు ఇత్తురని ఇంద్రుడెరుగును కాన - అతడు మీకు సహాయకారిగా నుండును. ఆ మిత్రులు " ఏ మార్గమున వధువు ఇంటికి ప్రయాణము చేయుదురో ఆ మార్గము నిష్కంటకముగా నుండుగాక, ఓ దేవతలారా, మా భావి దాంపత్యము సుసంబద్ధమగు గాక " అని ప్రార్థించి మిత్రులను పంప నిశ్చయించేవారు. ఈ రోజులలో కన్యాదాత ఇందు నిమిత్తము వరుని నిశ్చయించుటకు తన మిత్రుల గాని, బంధువులగాని పంపి నిశ్చయించుచున్నారు.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి మూడవ భాగం

## స్నాతకవ్రతము - కాశీ యాత్ర

విద్యనభ్యసించి (పూర్వము వేద వేదాంగముల), స్వార్జిత ధనముతో గురు దక్షిణనిచ్చి, గురువుగారి అనుజ్ఞ పొంది స్నాతక వ్రతమును వరుడు ఆచరించవలయును. స్నాతక వ్రతములో ముఖ్యమైనది బ్రహ్మచర్య వ్రతలోప ప్రాయశ్చిత్తం చేసికొని, దర్పణ దర్శనమును, దండధారణము, ఛత్ర (గొడుగు) ధారణము, పరిమళ ద్రవ్యములను స్వీకరించుట, క్షురం - ఇవి స్నాతక వ్రతమందు మంత్రపూర్వముగా గ్రహించి, అవివాహితుడై, సన్యాసాది ధర్మములు అవలంబించుటో, లేదా వివాహము చేసుకుని గ్రహస్థ ధర్మము అవలంబించుటో నిశ్చయించుకొనవలెను. ఛత్రాది ధారణము చేసిన తరువాత కాశీ యాత్రకు పోవుచూ తనవారితో ఇట్లనును. "నేను బ్రహ్మచర్యవ్రతమాచరించి విద్యనభ్యసించిన వాడను. కాశీయాత్రకు పోవుచున్నాను. నాకు అనుజ్ఞ ఇవ్వండి."

"చరిత బ్రహ్మచర్యోహం కృతవ్రత చతుష్టయః
కాశీయాత్రాం గమిష్యామి అనుజ్ఞాం దేహిమే శుభాం

వివాహము చేయుటకు నిశ్చయము జరిగినది కనుక, కన్యాదాత తాను స్వయముగా గాని, తన కుమారునితో గాని, బంధువులతోగాని"ఓ వరుడా, అలంకార సహితయగు నా కన్యను నీకిచ్చెదను. ఈమెను పెండ్లి చేసికొని అగ్నిహోత్ర సహితుడవై వెడలుము. నా ఇంటికి రమ్ము." అని చెప్పును, లేదా చెప్పించును.

సాలంకారం మమ సుతాం కన్యాం దాస్యామి తేద్విజ
పాణిం గృహీత్వా సాగ్ని స్త్వం గఛ్ఛ స్వా గఛ్ఛ మద్గృహం

ఇదే పెళ్ళికుమారుని కాశీ యాత్ర. అప్పుడు వరుడు పాణిగ్రహణాఖ్యమగు కర్మనాచరించదలచి - విఘ్నములు లేకుండ పరిసమాప్తికై గణపతి పూజ, శుద్ధికై, వృద్ధికై, అభ్యుదయమునకై స్వస్తిపుణ్యాహవాచనము చేసికొనవలెను.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి నాలుగవ భాగం

## వధువు గౌరీ పూజ

ఇచ్చట కన్యాదాత తన కుమార్తె ఆయుష్యాభివృద్ధికై గౌరీ కంకణ పూజ చేసి కన్య ఎడమచేతికి రక్షాబంధనము కట్టును. గౌరీ పూజానంతరము వధువును ధాన్యపు మూట మీదనో బియ్యపు తట్టలోనో కూర్చుండబెట్టెదరు. ఇది ధన ధాన్యాభివృద్ధిని సూచించును.

ఇంకా ఉంది



# హైందవ వివాహ పద్ధతి ఐదవ భాగం

## ప్రవర పద్ధతి

వరుని తరపున వర ప్రవర గోత్రములు చెప్పి వరుని తండ్రి తాత ముత్తాతల పేర్లు చెప్పవలెను.

| | | | |
|---|---|---|---|
| | గోత్రస్య | | న ప్త్రే |
| | గోత్రస్య | | పౌత్రాయ |
| | గోత్రస్య | | పుత్రాయ |
| | గోత్రస్య | | వరాయ |

అని చెప్పుచూ కన్యను కోరవలెను.

అప్పుడు కన్యాదాత తమ ప్రవరయు, తండ్రి తాత ముత్తాతల పేర్లను చెప్పవలెను.

| | | | |
|---|---|---|---|
| | గోత్రస్య | | నప్త్రీం |
| | గోత్రస్య | | పౌత్రీం |
| | గోత్రస్య | | పుత్రీం |
| | గోత్రస్య | | నామ్నీంభవదీయాం కన్యాం |

ధర్మప్రజా సంపత్త్యర్థం వృణీ మహే.
ధర్మప్రజా సంపత్త్యర్థం వరింతుము అని చెప్పెదరు.

వృణీధ్వం దాస్యామీతి ప్రతిభ్రూ యాత్
వరింపుడు ఇచ్చెదను అని కన్యాదాత ప్రతివచనము చెప్పవలెను.

ఈ ప్రక్రియ ముమ్మారు జరుపవలెను.

కృతార్థావయమితి పరమా వేదయెయుః
మేము కృతార్థులమైతిమి అని వారు వరునితో చెబుదురు.

అపుడు వరుడు
ధర్మ ప్రజా సంపత్య ర్థగ్ ం స్త్రీయ ముద్వహే
ధర్మ ప్రజా సంపత్యర్థం స్త్రీని వివాహము చేసికొనుదును అని సంకల్పం చేసి , వివాహములో అంగమగు ద్వితీయ యజ్ఞోపవీతమును ధరించును.

అప్పుడు కన్యాదాత ప్రాణాయామము చేసి
లక్ష్మి నారాయణ ప్రీత్యర్థం సాలంకృత కన్యాదాన మహం కరిష్యే

లక్ష్మి నారాయణ ప్రీతి నిమిత్తం సాలంకృత కన్యాదానం చేయుదును అని సంకల్పము చేసి మహా సంకల్పము చెప్పి

వరుని పూజించి, వరుని శ్రీ లక్ష్మి నారాయణ స్వరూపునిగా భావించి ఆసనమున కూర్చుండచేసి పాద్యమిచ్చి కాళ్ళు కడిగి

నమోస్త్వనంతాయ సహస్ర మూర్తయే
సహస్రపాదాక్షి శిరోరుబాహవే
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటీ యుగధారిణే నమః

అని గంధము అక్షతలనిచ్చి పూజ చేయును.
పూజానంతరము కనకముతో(బంగారముతో)
కూడినదియు, బంగారు నగలు కలదియునగు నా కన్యను ధర్మకామార్థ సిద్ధికై విష్ణు స్వరూపుడగు నీకిచ్చెదను.

కన్యాం కనక సంపన్నాం కనకాభరణై ర్యుతాం
దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోక జిగీషయా

అని కన్యా ప్రవర చెప్పి ..........నామ్ని అగు నా కన్యను వరుని ప్రవర చెప్పి........అని పేరుగల వరుడవగు నీకు

తుభ్యం ప్రజా సహత్వ కర్మభ్యః ప్రతి
పాదయామీతి కన్యాముదక పూర్వకం దద్యాత్

సంతతి కొరకును , లోక కార్యములందు సహవాసముగా ఉండుటకును, కర్మాచరణ కొరకును ఈ కన్యను ఇచ్చుచున్నాను అని ఉదకపూర్వకముగా దానము చేయవలెను.

వరుడు
స్వస్తీతి ప్రతివచనం
అంగీకార సూచకం గా చెప్పవలెను.

అప్పుడు కన్యాదాత
కన్యాదాన సాద్గుణ్యార్థం దక్షిణాం తుభ్యమహం సంప్రదదే నమః
అని కన్యాదాన దక్షిణ మిచ్చును.

ఇస్తూ కన్యాదాత పెళ్లికుమారునితో
ధర్మార్థ కామేషు త్వ యైషా నాతి చరితవ్యా - ధర్మమందును అర్థమందును కామమందును నీవు ఈమెను ఉల్లంఘించి చరించరాదు అనవలెను.

పెళ్లికుమారుడు నాతిచరామి
అని మీరు నుడిపినట్లు ధర్మార్థకామములందు ఈమెను దాటి చరింపను అని ప్రతి వాగ్దానమిచ్చి తర్వాత వివాహ వేదికనందు వరుడు అగ్నిప్రతిష్టాపనము చేయును.
ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 6 వ భాగం

## మధుపర్కము

మధుపర్కము అనగా మధువు (తేనె) తో కలిపినది.

అతిథి, వరుని గురువు, తండ్రి మొదలగువారు వచ్చినప్పుడు తేనె, పెరుగు, కొంత మంది నెయ్యిని కూడా కలిపి భుజించెటకు ఇచ్చెదరు. కొందరు ఈ మూడింటిని వేపుడు బియ్యము లేక మరమరాలు కలిపి ఇచ్చెడి ఆచారమున్నది. దీనితో కొంత మంది గోవును కూడా ఇచ్చేవారు.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 7 వ భాగం

## ఉత్సర్జనము

ఆ గోవు గడ్డి తిని, నీళ్ళు త్రాగి స్వేచ్ఛగా బ్రతుకునట్లు మంత్రజపముతో విడిచిపెట్టుదురు.దీనిని గోమధుపర్కము అందురు.వరుని అతిధిని పూజించినట్లు పూజించవలెను కావున వరుని సమీపమునకు వధువుని తీసుకుని వచ్చి కూర్చుండబెట్టి, వరుడు మంత్ర సంస్కారపూర్వకముగా వధువును చూపించుటకు వధూవరుల మధ్య తెరను అడ్డు పెట్టి వరుని మధుపర్కముతో పూజించుటకు సంకల్పము చెప్పి వరుని కాళ్ళను కడిగి అర్ఘ్యమును ఇచ్చి ఆ సమయమున వస్త్రము (గోవుని ఇచ్చి, ఈ ఆచారము ఇప్పుడు జరగటం లేదు) మొదలగునవి శక్తికొలది ఇచ్చి వరుని అలంకరించి మంత్రముతో పంచల చాపును వరునికీయవలె.అవే మధుపర్కములు.

మధుపర్కపూజాసమయమున ఇచ్చే వస్త్రములు కావున పీటికి మధుపర్కములని వాడుకలోనికి వచ్చినది. తర్వాత తేనె పెరుగును పాత్రలోనుచి దానిపై పెద్ద పాత్రను పెట్టి కూర్చుతో తీసుకొని

మధుపర్కో మధుపర్కో మధుపర్కః
అని 3 సార్లు చెప్పి

యన్మధునో మధవ్యం పరమ మన్నాద్యం వీర్యం, తేహానాం మధునో మధవ్యే పరమేణా న్నాద్యేన వీర్యేణ, పరమోన్నాదో మధవ్యోసాని. అమృతోపస్తరణమసి
అని కొంచెము నీరు త్రాగి మధుపర్కద్రవ్యమును తీసుకొనుచు పైమంత్రమును ఒకమారు , మంత్రము లేకుండా రెండుమార్లు తిని,

అమృతాపిదానమసి
ఓఉదక మానీవుఅమృతపదార్థమునకు మూతవంటిదానవని కొంచెముజలమునుత్రాగి హస్త ప్రక్షాళనముతో మిగిలినది తనకు కావలసినవారికీయవలెను.

కొందరు మధుపర్క పూజ అయిన తర్వాతనే కన్యాదానం చేయుదురు. మధుపర్కము, కన్యాదానము అయిన తర్వాత మంగళాష్టకములు చదివెదరు.

తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం
తదేవ విద్యాబలం దైవబలం తదేవ
లక్ష్మీపతే తేంఘ్రియుగం నమామి
శ్రీదేవితనయ శ్శివస్సుఖకరో మిత్రశ్శశీకంపన
స్సర్వేతే మునయో చలాచల దిశ స్సర్వా మృగేంద్రాః ఖగాః
నద్యః పుణ్య సరోవరాణి దితిజా సస్తీర్థాని కంజానన
శ్చేంద్రో పన్న్య మరానదా జలధయః
కుర్వంతు వా మంగళం
అని చదువుదురు.

సుముహూర్త సమయమున వధూవరుల శిరస్సులందు బెల్లము జీలకర్రా పసుపు కలిపిన ముద్ద పెట్టుదురు. మంగళ ద్రవ్యములను శిరస్సున పెట్టుదురు.

ధ్రువంతే రాజా వరుణో ధృవం దేవో బృహస్పతిః
ధ్రువంత ఇంద్రశ్చాగ్నిచ్చ రాష్ట్రం ధారయతం ధృవం
వరుణుడు, బృహస్పతి, ఇంద్రుడు, అగ్ని నీ రాష్ట్రములను (వ్యవహారములను) ధృవమైన దానిని గాపింతురు గాక.

అప్పుడు
అయం ముహూర్త స్సుముహూర్తో అస్తు
ఈ ముహూర్తం సుముహూర్తం అగు గాక అని పెద్దలు అనెదరు.

ఆ సుముహూర్తమున వరుడు వధువును చూచి ఇట్లు జపించవలెను.

అభ్రాతృఘ్నీం వరుణా పతిఘ్నీం బృహస్పతే, ఇంద్రా పుత్రఘ్నీం లక్ష్మ్యంతా మస్యై సవితస్సువ

ఓ వరుణా ఈమె (అభ్రాతృఘ్ని అనగా ) సోదరులకు వృద్ధి లక్ష్మిని ఇమ్ము. ఓ బృహస్పతీ ఈమె యొక్క భర్త వృద్ధి పొందు లక్ష్మినిమ్ము. ఓ ఇంద్రా ఈమెకు పై లక్ష్మలన్నిటినీ ఇమ్ము. ఓ సవితా భాతృ , పతి, పుత్ర వృద్ధి కలుగ చేయుము.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 8 వ భాగం

## సమీక్షణము (వధువుపై చూపు)

పెండ్లికుమారుడు తిరిగి పెండ్లికుమార్తెను సమీక్షించవలెను. ఆమెను పూర్తిగా చూచుచు ఈ మంత్రము చదువవలెను.

అఘోరచక్షు రపతిఘ్న్యేధి శివా పతిభ్య స్సుమనా స్సువర్చాః జీవసూర్దేవకామా శ్యోనా శం నోభవ ద్విపదేశం చతుష్పదె

ఓ కన్యా నీవు సౌమ్య దృష్టి కలదానివై సౌభాగ్యవతివి కమ్ము. నాకును నా సోదరులకును సుఖకారకురాలవు కమ్ము. మంచి వర్చస్సుతో జీవసంతతిని పొందుము. దేవతలను పూజింపవలెనని కోరుచుండుము. ప్రశస్తముగా మాకు సంబంధించిన మనుష్య పశు పక్షాదులకు సుఖకారకురాలవు కమ్ము అని వధువును చూడవలెను. ఆ సమయమున వధూవరుల నడుమ తెరను తీయుదురు.

ఇప్పటినుంచి వధూవరులిద్దరును కలిసి సంకల్పం చేదురు.

అవాభ్యాం కర్మాణి కర్తవ్యాని ప్రజాశ్చోత్పాదయిత వ్యాః
మనచే కర్మలాచరింపబడవలయును.
పుత్రులు జనింపవలయును అని అర్ధము.

తస్యాభ్రువోరంతరంగం దర్భేణ సమృజ్య ప్రతీచీనం సిరస్యేత్ ఇద మహం యా త్వయిపతి ఘ్న్య లక్ష్మీస్తాం సిర్దిశామి
వధువు కనుబొమల మధ్య భాగమును వరుడు దర్భతో తుడిచి కన్యాపతిని బాధించునదియగు ఏ అలక్ష్మి నీయందున్నదో ఆ యలక్ష్మిని ఇదిగో తుడిచివేయుచున్నాను యనుచు ఆ దర్భను పశ్చిమముగా పారవేయవలెను

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 9 వ భాగం

## బండి కాడి

దీనికొక గాధయున్నది. అపాల అను ఒక అవివాహితకు బొల్లి వ్యాధి వచ్చినది. ఆమెను అందుచే ఎవరూ వరించలేదు. ఇంద్రుని గూర్చి యాగము చేసిన అది పోవును. వివాహము కానిది దానిని ఆమె చేయజాలదు. అందుచే ఆమె విచారించుచూ ఒకనాడు నదిలో స్నానము చేయుచూ ప్రవాహమున కొట్టుకుని పోవుచుండగా సోమలత ఒకటి ఆమె దగ్గరకు కొట్టుకుని వచ్చినది. ఆమె దానిని తన పళ్ళతో నమిలి ఇద్రుని ఉద్దేశించి నోటితో పిడిచిపెట్టింది. ఇంద్రుడు వచ్చి ఆ రసమును గ్రహించి తన రధమునకు ఇరుసునకును కాడికి గల రంధ్రములనుండి జలమును ప్రవహింపచేసి ఆమె మీద పోసెను. దానివలన ఆమె రోగవిముక్తురాలయింది. ఆమెకు సూర్య వర్చస్సు వచ్చింది.

ఈ సంప్రదాయములో బండికాడిని తెచ్చి వధువు నెత్తిమీదున్న ఇంవము మీదికి వచ్చునట్లు కాడి రంధ్రమునుంచి ఉదకము తెప్పిచి పోయుచు

ఖే నసః ఖే రథః ఖేయుగస్య శచీపతే
అపాలా మింద్రతిః పూర్త్వ్యకరత్సూర్య వర్చసమ్

ఉదకమందున్న క్రూరత్వము పోవు గాక. ఉదకము పైకి వచ్చుగాక. అపుత్రఘ్నులు, పుత్రహింస చేయనివి, పుత్ర మరణ హేతువులు కాని జలము పైకి వచ్చు గాక అనుచు దర్భ్యణ్యమును చూచుటకు వీలుగా మండలాకారములో ఉభయుల తల్లిదండ్రులను సోదరులను నిలబెట్టి పై మంత్రమును చెబుదురు.

దాని అర్థమిది - ఓ ఇంద్రా శచీపతీ, బండీరుసుతొలనుండిన్ని రథరంధ్రమునుండిన్ని కాడి రంధ్రమునుండిన్ని జలమును మీదబోసి అపాల అను కన్యను ముమ్మారు పవిత్రమొనర్చి సూర్య వర్చస్సు కలదానివిగా చేసితివి. అట్లే ఈ పెండ్లికుమార్తెనుగూడా చేయుము.

కాడి రంధ్రమునందు బంగారముంచి (మంగళ సూత్రములను) ఓ కన్యా ఈ సువర్ణము నీకు శుభప్రదమగుగాక. నీ మీద పడు జలము నీకు

శుభప్రదములగుగాక. ఈ కాడి, ఈ కాడిరంధ్రము శుభప్రదములగుగాక. పతినైన నాతో నీ శరీరమును కలుపుము అని చెప్పును.

శంతే హిరణ్యగం సముశం త్వాపశ్శ్యం తే మేధీ భవతు శంయుగస్య తృద్మ
శం త ఆపశ్శతపవిత్రా భవం త్వధాపత్యా తన్వగ్ ం, నగ్ ం సృజస్వ

మంత్రమును చదువుదురు. తర్వాత వధువును స్నాన మంత్రములతో స్నానం చేయించవలెను.

## కన్యకు దీక్షా వస్త్రము

అనంతరము కొత్తది, తడపనిది, ఇంతకుముందు ధరింపనిది,అంచుగల వస్త్రమును ఇంద్రుని స్తోత్రము చేయుచు వధువునకు కప్పుదురు. దీనిని మధుపర్కము చీర అందురు. ఈ వస్త్రము వధువుయొక్క దీక్షా వస్త్రము. మధుపర్క సమయములో జరుపు విధి కావున ఈ వస్త్రమునకు కూడా మధుపర్కము అని పేరు వచ్చినది.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 10 వ భాగం

## మాంగళ్యధారణము

మాంగళ్యతంతువును దర్భలతో పేసిన నడికట్టును పూజించిన తర్వాత మంగళసూత్ర ధారణమును కర్మాధికారమునకు నడికట్టు కట్టించుదురు.

మాంగళ్యతంతునానేన మమజీవనహేతునా
కంఠేబధ్నామి సుభగే త్వంజీవశరదాం శతం

ఓ సౌభాగ్యవతీ, నా జీవనమునకు హేతువైన ఈ మాంగళ్యతంతువును ఈ నీ కంఠమునకుకట్టుచున్నాను. నీవు వంద సంవత్సరములుజీవింతువుగాక.

ఆశాసాన సౌమనసం ప్రజాగ్ సౌభాగ్యం తనూం
అగ్నేరనువ్రతా భూత్వా సన్నహ్యే సుకృతాయ కమ్

ఈమె తనకు మంచి మనసును సంతతిని సౌభాగ్యమును కోరుచు అగ్ని కార్యము చేయుటకు అనుకూలురాలై నిలచియున్నది. వివాహమనే ఈ పవిత్ర కర్మ నిమిత్తము ఈ నడికట్టు సుఖముగానుండునట్లు కట్టుచున్నాను.

ఇంకా ఉంది



# హైందవ వివాహ పద్ధతి 11 వ భాగం

## తలంబ్రాలు

కపిలాగ్ ం స్మ్మరయంతు దక్షిణా ః పాంతుబహుదేయం చాస్తు
పుణ్యం వర్ధతా మ్ శాంతిరస్తు పుష్టిరస్తు తుష్టిరస్తు
యధాహ మస్యా అత్ృపగ్గ్ స్త్రియైపు మాన్
యధాస్త్రీ త్రప్తృతి పుగ్ ం సి ప్రియే ప్రియా
ఏవం భగ స్యత్ృప్యాణి
పశవో మేకా మ స్సమృధ్ధ్యతా మ్
యజ్ఞో మే కా మ స్సమృధ్ధ్యతా మ్

తలంబ్రాలు పోయుచుందురు. తల మీద పోసెడి బియ్యమునే తలంబ్రాలని పేరు.

### కపిలా వచనాది మంగళాచార ప్రాప్తం కుర్యాత్

అని ప్రక్రియగా వరుడు వధువు దోసిటిలో పాలచుక్కలు వేసి కడిగి ఆరబెట్టిన బియ్యము కొంచము కొంచము 2 మార్లు వేసి మరల పాల చుక్కలు వేయును. అట్లే వరుని

దోసిటిలో బియ్యము పోసెదరు. బిందెతో నీళ్ళను తీసుకుని వచ్చి బ్రాహ్మణులతో కూడ కపిలను స్మరింతురు గాక. దానమియ్యదగిన పదార్ధములు సమృద్ధిగానుండుగాక. పుణ్యము వృద్ధియగుగాక. శాంతి కలుగు గాక. పుష్టి కలుగు గాక. తుష్టి కలుగు గాక.

నేను ఈ స్త్రీయందు తృప్తిగలవాడనగునట్లు ఈ స్త్రీ నాయందు తృప్తిగలది యగునట్లును దేవతలు కావలసిన శక్తులు అనుగ్రహింతురు గాక. నాకు పశు సమృద్ధి, యజ్ఞ సమృద్ధి గలుగుగాక. కామసమృద్ధి గలుగుగాక అని చెప్తూ వరుడు వధువు తలపైని వధువు వరుని తలపైని తలంబ్రాలు పోయుదురు. పెద్దలు అందరు ఆశీర్వదింతురు.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 12 వ భాగం

## బ్రహ్మ గ్రంధి

హోమసమయమున దంపతులు విడియుండకుండుటకు, దూరముగా పోకుండుటకు పురోహితుడు దంపతుల బట్టల కొంగులను ముడివేయును. దీనినే బ్రమ్మ గ్రంధి లేక బ్రహ్మ ముడి అందురు. వరుడు వధువు కుడి చేయిని పట్టుకుని అగ్ని సమీపమునకు తీసుకువస్తూ,

పూషాత్వేతో సయతు హస్త గృహ్యాశ్వినౌ త్వాప్రవహతాగ్ం
రథేనగృహాన్ గచ్ఛ గృహపత్నీ యధా సో వశినీత్వం విదథ
మావదాసి సోమః ప్రథమో వివిధే గంధర్వో వివిధ ఉత్తరః
త్రతీయో అగ్నిష్టే పతి స్తురీయస్తే మనుష్యజాః
సోమో దదద్గంధర్వాయ గంధర్వో దద దగ్నయే
రయించ పుత్రాగ్ శ్చాదా దగ్నిర్మహ్య మధో ఇమామ్

ఓ వధూః ఆదిత్యుడు నీ చేతులు పట్టుకుని ఇక్కడనుండి అగ్ని సన్నిధికి తీసుకుని వచ్చుగాక. హోమము అయిన తరువాత బండి మీద మా ఇంటికి తీసుకొని వెళ్ళెదను.

అశ్వినీ దేవతలు అనుమతి ఇత్తురు గాక. నీవు నా ఇంటికి ఆధిపత్యము వహించుటకు రమ్ము. మా ఇంటికి స్వామ్యమును పొంది యజ్ఞము మొదలైన వాటిగురించి చెప్పుము. కన్య పుట్టగానే కొంతకాలము సోముడు, కొంతకాలము గంధర్వుడు, కొంతకాలము అగ్ని కాపాడుచుందురు. వారిని హోమ ప్రార్థనాదుల సంతృప్తిగావించి వారివలన తాను కన్యకను పొంది ఆమెకు పతి యగును. సోముడు నిన్ను గంధర్వునకిచ్చెను. గంధర్వుడు అగ్నికిచ్చెను. నేను నిన్ను కాపాడవలసిన నాలుగవ వాడను. అగ్ని నిన్ను, ధనములను, పుత్రులను నాకు ఇచ్చుగాక.

అని అభిమంత్రించి కన్యకయొక్క కుడిచేయి పట్టుకొనును. ఇదే పాణిగ్రహణము. పాణిగ్రహణ మంత్రములు నలుగున్నవి.

పాణిగ్రహణ మంత్రములు: -

1. గృభ్ణామితే సుప్రజాస్త్వాయ హస్తం మయాపత్యా జర దృష్టిర్య థాసః
భగో ఆర్యమా సవితా పురంధిర్మహ్యం త్వా దుర్గార్ హపత్యాయ దేవాః
2. తేహ పూర్వేజనాసో యత్రపూర్వవహో హితాః
మూర్ధన్వాన్ యత్ర సౌభ్రవః పూర్వో దేవేభ్య అతపత్
3. సరస్వతి ప్రేదమవ సుభగే వాజినీవతి
తాం త్వా విశ్వశ్య భూతస్య ప్రగాయామస్యగ్రతః
4. య ఏతి ప్రదిశస్సర్వా దిశోను పవమానః

హిరణ్యహస్తో ఐర మ్మస్స త్వా మన్మనం కృణోతు
(మన్త్రానే హస్తగ్రహణ మ్ పాణిగ్రహణ ముహూర్తః బువస్సు)

ఓ కన్యా మంచి సంతతిని పొందుటకు బహు ప్రజ్ఞావంతులైన భగుడు, ఆర్యముడు, సవిత అను దేవతలు గ్రహస్థ ధర్మములు నెరవేర్పుటకు నిన్ను నాకు ఇచ్చిరి. చివరవరకూ నాతో కలిసియుండుము. ఆ దేవతలు గ్రహస్థ ధర్మమును నడిపించినవారు. అందులో అగ్ని మొదటివాడు. వారు నడిపించిన గ్రహస్థ ధర్మములు నడుపుటకై నిన్ను నాకు ఇచ్చినారు. అందుకని నీ హస్తమును నేను పట్టుకునుచున్నాను.

ఓ సరస్వతీ నీవు ఈ పాణిగ్రహణమును రక్షింపుము. అన్నసమృద్ధి కలదానవు. నిన్ను మేము స్తుతించుదము. భక్తులకిచ్చుటకై బంగారము చేతులతోనిడుకొని అన్నిదిక్కుల సంచరించు అగ్ని సఖుడగు వాయువు నిన్ను నాయందు మనస్సుగలదానిపిగా గాపించు గాక.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 13 వ భాగం

## సప్తపది

సప్తపది అనగా వధువును ఏడడుగులు నడిపించుచూ తన కోరికలను ఏడు వాక్యములలో తెలుపును. తన సఖ్యమును తెలిపి ఆమె సఖ్యమును సంపాదించును. జన్మాంతరమేగాక జన్మ జన్మాంతరములవరకూ సఖ్యమును కుదుర్చు ఈ సప్తపదిని సాప్తపదీనము అనుటకు కారణమైనది. ఈ సప్తపది పూర్తికాని ఎడల వివాహము పూర్తి కాదు. అగ్ని ఉత్తరముపైపున కుడికాలు మొదట పెట్టుచూ ప్రాగ్దిక్కుగా గాని ఉత్తర దిక్కుగా గాని వధువును వరుడు నడిపించును. ఏడడుగులు వేయునప్పుడు క్రమముగా ఏడు మంత్రములు చెప్పవలయును.

1. ఏక మిషే విష్ణు స్త్వా న్వేతు
2. ద్వే ఊర్జే విష్ణు స్త్వా న్వేతు
3. త్రీణి వ్రతాయ విష్ణు స్త్వా న్వేతు
4. చత్వారి మాయోభ వాయ విష్ణు స్త్వా న్వేతు

5. పంచ పశుభ్యో విష్ణు స్త్వా న్వేతు
6. షడృతుభ్యో విష్ణు స్త్వా న్వేతు
7. సప్త సప్తృభ్యో హోత్రాభ్యో విష్ణు స్త్వా న్వేతు.

1. నీకు అన్న సమృద్ధి కలుగుటకై విష్ణువును ప్రార్థిస్తున్నాను.
2. బలము కలుగుటకై
3. కర్మ సమృద్ధి కలుగుటకై
4. సుఖం కలుగుటకై
5. పశు సమృద్ధి కలుగుటకై
6. ఆరు ఋతువులు అనుకూలములగుటకై
7. సోమయాగమునకు ముఖ్యులగు ఋత్విక్కులు లభించుటకై

విష్ణువు నిన్ను అనుసరించుగాక. నాతో ఏడడుగులు నడిచినందున మనం సఖులమైతిమి. నీ సఖ్యమును నేను పొందితిని. నీ స్నేహము విడిచి పోనీయను. నీవు నా స్నేహమునుండి వీడవలదు. మన మిద్దరమూ కలసికొంటిమి. ఈ పని ఇలా చేయవలెనని ప్రతికార్యమును కలసి చేయుదము.

పరస్పరం ప్రీతి కలవారమై ప్రకాశమానమైన మంచి మనస్సు కలవారమై అన్నమును బలమును కలసి

అనుభవింపగలవారమై కలసికొంటిమి. ఏ ధర్మమాచరించినను బాగుగా కలసి చేయుదము. నీవు ఋగ్వేదమవు. నేను సామవేదమును. ఋక్కును సామమును పరస్పరము సంబంధం కలిగియుండునట్లుగా మనం కూడా కలిసియుందము. నీవు పృధ్విపి. నేను ఆకాశమును. నేను రేతస్సును. నీవు దానిని భరించుదానవు. నేను మనస్సును. నీవు వాక్కువు. పురుషుడగు పుత్రుని పొందుటకు, ఐశ్వర్యమును, పుత్రుని పొందుటకై ఓ ప్రియ బాషిణీ నీవు నాతోగూడా రమ్ము. పై అర్థమును ఇచ్చు సప్తపది మంత్రము ఈ దిగువనీయబడినది.

సఖా సప్తపదా భవ సఖాయౌ సప్తపదా భభూవ సఖ్యం

తేగమేయగ్ం సఖ్యాత్తే మా యోషగ్ం సఖ్యాన్మే మాయోష్టా ః

స్సమయావ సంకల్పావహైసం ప్రియౌ రో పిష్ణూ సుమనస్యమానౌ

ఇషమూర్జమభి సంపసానౌ సం సామనాగ్ంసి సంవ్రతా సముచిత్తాన్యాకరం

సాత్వమస్యమూహ మమూహమస్మి సాత్వం ద్యౌరహం పృధిపీత్వగ్ం రేతోహగ్ం

రేతో భృత్త్వం మనోహమస్మి వాక్త్వగ్ం సామాహమ స్మృక్త్వ గ్ం

సామా మను వ్రతా భవ పుగ్ంసే పుత్రాయ వేత్తవై శ్రియై పుత్రాయ వేత్తవ ఏహి నూనృతే
ఇంకా ఉంది



## హైందవ వివాహ పద్ధతి 14 వ భాగం

### ప్రధాన హోమములు

**తర్వాత ఉభయులు అగ్నికి ప్రదక్షిణ చేసి 16 ఆజ్యాహుతులు హోమము చేయవలెను. అందు కొన్ని.**

సోమాయ జనివిదే స్వాహా
గంధర్వాయ జనివిదే స్వాహా
అగ్నయే జనివిదే స్వాహా
కన్యలా పితృభ్యో యతీ పతిలోక మవదీక్షామదాస్థ స్వాహా
ప్రేతో ముంచాతి నాముతస్సుబద్ధా మముతస్కరత్, యథయ
మింద్ర మీఢ్వసుపుత్రా సుభగా సతీ స్వాహా.
ఇమాం త్వమింద్ర మీఢ్వస్సుపుత్రాగ్ ం సుభగాం కృణు,
దశా స్యాంపుత్త్రా నాదేహి పతిమేకాదశం కృధి.
అగ్ని రైతు ప్రధమో దేవతానాగ్ ం సో స్యై ప్రజాం
ముంచతు మృత్యుపాశాత్
తదయగ్ ం రాజా వరుణోను మన్యతాం యధేయం స్త్రీ పౌత్ర
మఘం వరోదాత్
ఇమామగ్నిస్త్రాయతాం గార్హపత్యః ప్రజా మస్యై నయతు

దీర్ఘమాయు : ఆశూన్యోపస్థా జీవతామస్తు మాతా పౌత్రమానంద మభిప్రబుద్య తామియాం
మాతే గృహేసిశి ఘోష ఉత్థా దన్యత్ర త్వ ద్రుదత్య స్సంపిశంతు
మాత్వం పికే శ్వ్యర అవధిష్ఠా జీవపత్నీ పతిలోకే పిరాజ పశ్యంతీ ప్రజాగ్ం సుమనస్యమానాం
వధువును మొదట కాపాడిన సోమునకు ఈ హావిస్సు దత్తమగు గాక. అట్లే గంధర్వునకు, అగ్నికిని, ఈ హావిస్సు దత్తమగుగాక. పతి కులమునకై వెడలుచున్నది. ఈమె కన్యకా దీక్షను విడచినది.
ఓ ఇంద్ర వర్ష దాతా, ఈమెను పితృకులమననుండి పీడునట్లు చేయుము. పతికులమునుండి విడుచునట్లు చేయవద్దు. ఆమె పతి కులమునందు సుబద్ధురాలుగా అనుబంధము కలదై సుపుత్రయు, సౌభాగ్యవతియు అగు గాక.
ఈమెకు 10 మంది పుత్రులు కలుగునట్లు చేయుము. నన్ను 11 వ వానిని గాపింపుము. దేవతలలో ప్రథముడైన అగ్ని వధువు సంతతిని మృత్యుపాశమునుండి విడిపించు గాక. వైవాహికాగ్ని (గ్రార్హ పత్యాగ్ని) ఈ వధువును రక్షించి దీర్ఘాయుస్సును పొందించు గాక. బహుపుత్రులకు మాతయై పుత్రులచే నలంకరింపబడు గాక.

ఈమె నిద్రనుండి లేవగానే చుట్టూ ఆనందముతో ఆడుచున్న పుత్రులను చూచి ఆనందించు గాక.
ఓ వధూ నీ గృహమందు రాత్రియందు ఆర్త ధ్వని, నీకు రోదనము, జుట్టు పిరబోసుకొనుట, గుండెలు బాదుకొనుట, సంభవించకుండు గాక. నీవు మంచి మనస్సు కల సంతతిని ధీర్ఘాయుష్యులను చూతవు గాక.

ఇంకా ఉంది.



## హైందవ వివాహ పద్ధతి 15 వ భాగం

### సన్నికల్లు

దక్షిణేన పదాశ్మాన మాస్థాపతి

వధువుచే ఆమె కుడికాలుతో సన్నికంటిపైన

అతిష్ఠేమ మశ్మాన మశ్మేవత్వగ్ ష్థిరాభావ

అభి తిష్ఠ పృతన్యత స్సహస్వ పృతనాయతః

అనుచూ తొక్కించ వలెను.

ఓ వధూ నీవీ రాతిని తొక్కుము. ఈ రాతివలెనే నీవూ ష్థిరమైనదానివి కమ్ము. చెడ్డవారిని ఎదిరించి తరిమివేయుము. నీ విరోధులను పరిభవింపుము. అని వధువు దోసిటలో నేతితో అభిఘరించి 2 సార్లు లాజలు (పేలాలు) పోసి తిరిగి నేతితో అభిఘరింప వధువు హోమము చేయును. 3 సార్లు లాజ హోమము చేయవలెను.

ఇంకా ఉంది.



## హైందవ వివాహ పద్ధతి 16 వ భాగం

### లాజహోమము

**1.** ఇయం నార్యుపబ్రూతే కుల్పాన్యావపంతికా
దీర్ఘాయురస్తు మేపతిర్జీవాతు శరదశ్శతం (వధ్వంజలి వామ పార్శ్వ నజుహోతి) వధ్వా ఇదం న మమ

నా పతి దీర్ఘాయువై నూరు సంవత్సరములు జీవించుగాక అని కోరుచూ ఇట్లు హోమము చేసి అగ్నికి ప్రదక్షిణము చేసి సన్నికల్లు తొక్కవలెను. వెనుక రీతిని స్థిరత్వమును కోరును.

**2.** ఆర్యమణం ను దేవం కన్యా అగ్ని మయక్షత
స ఇమాం దేవో అధ్వరః ప్రేతో ముంచాతి నాముతస్సుబద్ధా
మము తస్కరత్ ఆర్యమ్ణేగ్నయ ఇదం న మమ

పూర్వము ఆర్యమును ఈ లాజలచేత పూజించి కన్యకలు పతులను బడసిరి. ఆయన ఈ వధువును పితృ కులమునుండి విడిపించి పతి గృహమునందు

సుబద్ధరాలై పతికులమునుండి విడువకుండునట్లు చేయుగాక.

3. త్వమర్యమా భవసి యత్కనీనాం నామ స్వధావ త్స్వర్యం బిభర్షి,
అంజంతి వృక్షగం సుదితం నగోభిర్యద్ధంపతీ స మనసా కృణోషి, ఆర్యమ్ణ ఇదం న మమ.

ఓ అగ్నీ నీవు ఆర్యముడవు. దాతవు. ఎందుకన, కన్యలును, అన్నమును, స్వర్గమును నీ అధీనములు. నీ దయవలన పురుషులు వానిని పొందుదురు. బాగుగా పాతిన వృక్షమునకు నీరు పోసినట్లు, పేలాలు మొదలగు ద్రవ్యములను నీయందు హోమము చేసెదరు. నీవే దంపతులను సమాన మనస్సుగలవారినిగా చేతువు. 3 సార్లు ప్రదక్షిణము చేయవలెను.

తుభ్యమగ్రే పర్యవహాన్ త్సూర్యాం వహతు నాసహ
పునం పతిభ్యో జాయాం దా అగ్నే ప్రజయా సహో
పునః పత్నీ మగ్ని రదా దాయుషా సహ వర్చసా,
దీర్ఘాయుర స్యా యః పతి స్స ఏతు శరదశ్శతమ్
విశ్వా ః ఉతత్వయా వయం ధారా ఉదన్యా ఇవ
అతిగాహే మహి ద్విషః

ఓ అగ్నీ తొలుత సూర్య అనే కన్యకను స్త్రీ ధనముతో కూడ నీకు ఇచ్చిరి. ఇప్పుడు నావంటి వరులకు పత్నిని ప్రజాసహితముగా ఇమ్ము. అగ్ని- ఆయుస్సుతోనూ వర్చస్సుతోనూ ఉన్న పత్నిని నాకిచ్చుగాక. అగ్ని వృషభములు మొదలగునవి వర్షమును దాటునట్లు - నీ చేత - శత్రువులను అతిక్రమించునట్లు చేయుగాక.

హోమములు పూర్తియైనవి. అప్పుడు వధువునకు కట్టిన నడికట్టును వరుడు విప్పును. సవిత ఏ పాశముతో నిన్ను కట్టెనో దానిని నేను విప్పుచున్నాను. అనగా వరుణపాశమునుండి విప్పుతున్నాను. పుణ్యలోకమైన బ్రహ్మలోకమున, పతినైన నేను నిన్ను కూడ ఉండునట్లు చేయుదును.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 17 వ భాగం.

## ప్రవేశ హోమము.

ప్రవేశ హోమమునుంచి గంధర్వ ప్రతిష్ఠాపనము పూర్వం వరుని ఇంట జరిగేది. ఇప్పుడు కల్యాణ మంటపములోనే చేయుచున్నారు.

వరుడు వధువును తన ఇంటికి తీసుకొని పోయి చేసెడి హోమము. ఇప్పుడు విడిదిలో ఈ హోమమును చేయుచున్నారు.

పూర్వము రధము మీద గాని బండి మీద గాని వధువును స్త్రీ ధనముతో సహా తీసుకొని వెళ్ళెడి వారు. ఇప్పుడు వీలైనంత వరకూ మోటారు కారు పై తీసుకు వెళ్లుచున్నారు.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 18 వ భాగం.

## వధువునకు సర్వాధిపత్యం.

ఉదుత్తర మారోహంతీ వస్యంతీ పృతన్యతః
మూర్ధానం పత్యురారోహ ప్రజయాచ విరాడ్భవ

ఈ వాహనమెక్కి విరోధులు లేకుండా చేసుకొని మా ఇంట ప్రధానురాలువగుము. పదిమంది కుమారులను బడయుము.

సమ్రాజ్ఞీ శ్వశురేభవ సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాం భవ
ననాందరి సంరాజ్ఞీ భవ సంరాజ్ఞీ అధి దేవృషు

అత్త మామలు ఆడుబిడ్డ నా సోదరులు పైన సామ్రాజ్ఞము వహింపుము. అదే మళ్లీ చెప్పుచూ మా ఇంటిలో కోడళ్లపైని అత్తమామలు పైని నీ సంతైని పైని నా ధనము పైని పెద్దరికము వహించుము.

సంకాశయామి వహతుం బ్రహ్మణా గృహై రఘోరేణ చక్షుషా మైత్రేణ

పర్యాణద్ధం పిశ్వరూపం య దస్యాగ్ స్యోనం పతిభ్య స్సపితా కృణోతుతత్

మీ తండ్రిగారు ఇచ్చిన ద్రవ్యములనుంచుటకు మా ఇంటి స్థానమును మంత్రోచ్చారణతో చూపుచున్నాను. నీవు దానిని సౌమ్య దృష్టితో చూడుము. అవన్నీ మా ఇంట అందరికీ సంతోషకరముగానుండునట్లు సవిత చేయుగాక. ఇంటిలోనికి తీసుకొనిపోవుచూ ఆమెచే ఇట్లు చెప్పించును.

గ్రహాన్ భద్రాన్ త్ సుమనసః ప్రపధ్యే పీరఘ్నీ పీరవతస్సుపీరాన్,
ఇరాం వహతో ఘృత ముక్షమాణా స్తే్వ ష్వహాగ్ ం సుమనా సం పిశామి నచలీ దేహాలీ మధీతిష్ఠతి

నేను పతి గృహమున ప్రవేశించుచున్నాను. ఈ గృహము మనోహరమైనది. మంచి మనస్సుగల అత్త మామలు బావలు, మరదులు, పుత్రులు ఉన్నారు. అందరి రక్ష ఉన్నది. అన్న సమృద్ధి కలది. బ్రాహ్మణులు భోజనము చేసినప్పుడు వడ్డించిన నతి జిడ్డు ఉన్నది. ఇట్టి ఈ ఇంటిలో మంచి మనస్సుగలదానై ఉందును. తర్వాత 13 మంత్రములతో హోమము చేయవలెను. వాటి అర్ధమిది.

అందరూ ఎడబాయక ఈ గృహమందే ఉండండి. నూట పదహారు సంవత్సరములు ఆయుస్సును పొందండి. ఇంద్రుడు మీకు సమృద్ధిని , క్షేమమును కలిగించు గాక.

ఓ వధూ. నిన్ను బృహస్పతి ఇచ్చినాడు. సంతానవతివై నాతో గూడ నూరు సంవత్సరములు జీవించుము. ఓ గోసముదాయమా, అశ్వ సమూహమా ఈ ఇంట జన్మింపుడు. సహస్ర దక్షిణుడగు ధనపోషుడు ఈ ఇంటనే కూర్చుండుగాక.

కొత్త దంపతులు ఆ గృహమున కూర్చుండి పుత్రవతియైన ఓ స్త్రీయొక్క కుమారుని వధువు తొడపై కూర్చుండబెట్టి వరుడు ఇట్లు చెప్పవలయును. దేవతలు చంద్రుని మూలమున బలధారులైరి. సోముని వలన ఓషధులు వృద్ధియగును. అప్పుడే యాగమునకు వీలగును గదా. ఈ భూమి కూడా సోముని చేతనే ధృఢమైనది. ఈ నక్షత్రముల మధ్య చంద్రుడు ఉన్నట్లే నీ తొడపై ఈ బాలుడు కూర్చుండునుగాక. ఆ బాలునికి ఫలములనీయవలెను.

ఓ ఫలములార. మీరు ప్రసవించు స్వభావము కలవారు. ఈ వధువుకూడా ప్రసవశీలురాలగుగాక. మీవలెనే మీ అనుగ్రహముచే ఈమెయు మంచి సంతతిని పొందుగాక.

ఓ వధూ, ఈ గృహమున గృహస్థ ధర్మములను చక్కగా నెరవేర్చుము. పతినైన నాతో నీ శరీరమును గలుపుము. ప్రజా సంపత్తి, ధర్మసంపత్తి, కామసంపత్తి, కలిగి జీవించియుండెడిదాక యజ్ఞాది విషయములగురించి, చెప్పదగినవాటిని, పుత్రపౌత్రాదులకు ఈ విధముగా చేయండి అని అభిముఖ్యముతో చెప్పుము.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 19 వ భాగం

## స్థాలీ పాకం

హోమములకును, బ్రాహ్మణ భోజనమునకు సరిపడిన వంట చేయాలి. వీలైనచో పత్ని దంపి వండవలయునని చెప్పబడినది. ఆ అన్నమునుండి అగ్ని మొదలగు దేవతలకు హవిర్భాగమిచ్చి హవిశేషముతో బ్రాహ్మణులను భుజింపజేయవలెను. అది మొదలు

యావజ్జీవం హోష్యామి.

నిత్యము, యావజ్జీవము ఈపనిని దంపతులు చేయుటకు ప్రారంభింతురు.

## గంధర్వ ప్రతిష్ఠాపనము

ఏకశయ్యాగతులౌ దంపతుల నడుమ ఒక పాలాశాది దండమునుంచి విశ్వావసు గంధర్వుని ఆవాహన చేసి సౌభాగ్యవతియగు ఈ వధువును చూడండి. ఈమెకు సౌభాగ్యమునిచ్చి స్వేచ్ఛతో మీమీ నివాసములకు వెళ్లండి. ఓ గంధర్వా నీవు మూడు రాత్రులు ఈ దండముందుండుము. మాకిద్దరికిని ప్రీతిని గలిగించి

శుభలక్షణుండైన నన్ను రక్షింపుము. దంపతులు నక్షత్రోదయముదాకా మౌనము అవలంబించాలి. నాల్గవనాడపరాత్రియందు గంధర్వదండపమునకు ఉద్వాసన చెప్పవలెను.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ 20 వ భాగం

## ధృవ దర్శనము, అరుంధతీ దర్శనము.

ఓ ధృవా, స్థిర నివాసముగల నీవు స్థిరమైన ఉత్పత్తి కలవాడవు. ఇతర నక్షత్రవటులకు కాదివలెనున్నావు. అట్టి నీవు మమ్ము విరోధులనుండి రక్షింపుము.

కశ్యపాది సప్త ఋషులు ఎప్పుడు అరుంధతియందు నిశ్చలత్వమును కనిపెట్టి ఆమెను కృత్తికలలో ప్రధానురాలుగా గావించిరో అప్పుడు షట్ కృత్తికలును అరుంధతియందు ప్రధానభావము వహించిరి. అట్లే వధువు నాకు అష్టమియగుగాక. సప్తర్షులకును అష్టమ స్థానమున నేనుందును గాక. ఈ వధువు కృత్తికలకు అష్టమీ స్థానీయురాలు అగును గాక. అనగా ఈ వధువు అరుంధతి వలె భాసించు గాక.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 21 వ భాగం

## శేష హోమము

చివరకు విధింపబడిన హోమము. అగ్ని వాయువు మొదలగు దేవతలు హవిర్భాగములనిచ్చి ఈ వధువునకు సాముద్రిక దుష్ట లక్షణములవలన గలుగు హాని రాకుండ దేవతలను ప్రార్థన చేయుదురు.

అగ్నే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తి రసి బ్రాహ్మణ స్త్వా
నాధ కామః ప్రపద్యేయా స్యాం పతిఘ్నీతనూః
ప్రజాఘ్నీ పశుఘ్నీ లక్ష్మిఘ్నీ
జారఘ్నే మస్యైతాం కృణోమి స్వాహః

ఓ అగ్నీ నీవు నష్టమగు కర్మను తిరిగి సంధానము చేయగలవాడవు. అందుకని నీకు ప్రాయశ్చిత్తి అని పేరు వచ్చినది. నీ సమ్రక్షణ కోరుచున్నాము. ఈ వధువునకు పతి హింసను చేయునట్టి చేతిలోని రేఖలు, ప్రజాఘ్ని, పశుఘ్ని మొదలైన ఏ అవలక్షణాలుగలవో అవన్నీ

నిర్మూలనము చేయండి. మేము చేయదలచిన కార్యములు సిద్ధించుటకై మిమ్ములను ప్రార్ధించుచున్నాము.

అట్లే వాయువుని, ఆదిత్యుని, ప్రజాపతిని వేర్వేరు దేవతలను ప్రార్ధింపవలెను.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 22 వ భాగము.

## సదస్యము.

తృతీయాహ్నిక క్రియాప్రాతకావాసనము సదస్యము. మహదాశీర్వాచనము, పెద్దలను సన్మానించుట, పండితులను సన్మానించుట, సభా కట్నం, గ్రామ కట్నం, వారి వారి ఆచారము చొప్పున జరుపవలెను.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 23 వ భాగ ము.

## నాకబలి

నాగపిల్లి అనుచున్నారు. దేవతలకు బలులు ఇచ్చుచు చేసెడి పూజ. వధువునకు దృష్టి దోషాది పరిహార మునకు చేసెడి ప్రక్రియ గావచ్చును. బియ్యపుపిండి పసుపు కుంకుమలతో నాలుగు పలకలుగా పట్టు పెట్టుదురు. కొందరు ఏనుగులు ఆకారముగా పట్టు పెట్టుదురు. దానిచుట్టూ 32 చిన్న పిడతలను పిదిక్కులందు 4 పెద్ద పిడతలను పెట్టి ఆ పెద్ద పిడతల కంఠములకు నాలుగు దిక్కుల తిరిగి వచ్చునట్లు దారములు పోసి కట్టుదురు. చిన్నపిడతలు 3 లో ఉప్పు, పప్పు, బియ్యము వేసి నాలుగు దిక్కులను నాలుగు దీపములుంతురు. 33 దీపములు వెలుగుచున్న పళ్ళెములో పట్టుకుని ఇద్దరు సువాసినులు తెచ్చుదురు. దంపతులు వాటికి ప్రదక్షిణములు చేయుదురు. 32 అన్న కబళములుంచవలెనని కొందరనుచున్నారు. దంపతులు వాటికి ప్రదక్షిణము చేసి చుట్టు చుట్టిన దారములు తీసివేసి నాలుగు దిక్కుల అర్ఘ్యములను ఇచ్చెదరు.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 24 వ భాగము.

## దండాడింపు.

తర్వాత దంపతులు ఉత్సాహముతో బుక్కా కొట్టుకుందురు.

## వేడుక

2 బిందెలలో నీళ్లు పోసి వాటిలో వెండినగ బంగారు నగ ఒకటి వేసెదరు. దంపతులలో మొదట వరుడు బంగారు నగ తీయవలెను. వధువు వెండి నగ తీయవలెను. రెండవ మారు వధువు బంగారునగ, వరుడు వెండి నగ తీయవలెను. 3 మార్లు మొదటి మారువలె తీయవలెను. దంపతులలో ఎవరు చురుకైనవారో తెలియును. ఇది ఒక వేడుక.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 25 వ భాగము

## కుత్తుకంటు

మెడకంటుకొని యుండు నగ. దీనిలో ఎరుపు, నలుపు (నీల లోహితములు) గల పూసలు, ఎర్ర పూసలు, నల్ల పూసలు గలిపి గ్రుచ్చినది గాన కుత్తుకంటును నీలలోహితమన్నారు. దానిలో దేవతకు నీలలోహిత అని పేరు పెట్టారు. గౌరీ పూజతో పీనికినీ పూజ చేసి పప్పు బియ్యము కలిపి వండిన అన్నము (అంటే పులగము) నివేదన చేసి

నీలలోహితే భవతః
కృత్యాసక్తి ర్వ్యజ్యతే
ఏధం తే స్యా జ్ఞాతయః
పతిర్బందేషు బధ్యతే.

ఈ మంత్రముతో మెడకు కట్టి నీలలోహితధారణ ముహూర్త సుముహూర్తోస్తు అని అనెదరు. ఇది పతి జీవించియున్నంతవరకూ విడువరాదు. హోమమునందు ఉపయోగింపగా మిగిలిన నేయిని వధూవరుల శిరస్సుపైనుంచెదరు. (ఇంకా ఉంది.)



# హైందవ వివాహ పద్ధతి 26 వ భాగము.

## వధూవరుల పరస్పర అవలోకనము హృదయ సంసర్గము

ఈ క్రింది మంత్రము చెప్పుచూ వధువు వరుని చూచును.

అపశ్యం త్వా మనసా చేకితానం తపసో జాతం తపసో విభూతమ్
ఇహ ప్రజా మిహరయిగ్ ం రరాణః ప్రజాయస్వ ప్రజయా పుత్రకామ

ఓ పుత్రకామా నేను నిన్ను మనసారా చూచుచున్నాను. నా మదిని నీవెరుగుదువు. నీవు తపస్సన సంస్కారయుతముగా జనించిన వాడవు. బ్రహ్మచర్య వేదాధ్యయనములచే పెరిగినవాడవు. ఈ గృహమందు పుత్రులను, ధనమును ఇచ్చువాడవై సంతతి రూపమున

నాయందు పుట్టుము. అప్పుడు ఈ మంత్రము చెప్పుచూ వరుడు వధువుని చూచును.

అపశ్యం త్వా దీ ధ్యానాగ్ం స్వయాం తనూగ్ం ఋత్వియే నాధమానామ్
ఉపమాముచ్చా యువతి ర్బ భూయాః ప్రజాయ సుప్రజాయా పుత్రకామే

ఓ పుత్రకామా నేను నిన్నును మనసారా స్నేహయుక్తముగా చూచుచున్నాను. నీవు నావలన పుత్రులను బడయదలచుచున్నావు. నా వలన భోగమును పొంది సంతతి రూపమున జన్మిచుము.

## హృదయ సంసర్గము

హోమము చేయగా మిగిలిన నేతితో ఇద్దరి హృదయములను వరుడు స్పృశించుచూ విశ్వదేవతలు జల దేవత, వాయువు, ధాతయు మన హృదయములను గలుపు గాక. పరస్పర సంబాషణ శక్తినిచ్చు సరస్వతీదేవి సంగమకాలమున అనుకూలమైన పలుకులను మనచే పలికించు గాక.

ప్రజాపతీ. నేను రేతస్సేకమునందు సమర్థుడనగుటకు నా శరీరమునందు ప్రవేశించుము. రూపమునిచ్చు దేవా, నీవును నా శరీరమున పిష్ట్యాదులతో ప్రవేశింపుము. ఓ ఇంద్రా నీవు సమస్త దేవతలతోనూ నా శరీరమున ప్రవేశించి మాకోరికలనీడేర్చుచు బహుపుత్రయుతులుగా మమ్ములను చేయుము. ప్రజాపతి మాకు సంతతిని కలిగించు గాక. ఆర్యముడు మేము ముసలివారమయినను మా స్నేహయుక్తులనుంచుగాక. ఓ వధువా, నీవు సౌభాగ్యవతివై మా గృహమున వసింపుము. మాకు మా పశు పక్ష్యాదులకు సుఖకారకురాలవు కమ్ము. మరునాడు నాల్గవనాడు రాత్రి రక్షాబంధనము విప్పుదురు.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 27 వ భాగము.

## మిథున విడియములు
## (దంపతి తాంబూలములు)

క్రొత్త దంపతులు ప్రాత దంపతులకు తాంబూలములు ఇచ్చెదరు.

## అప్పగింతలు.

కన్యాదాత వరునికి, వారి పెద్దలకు వధువు చేతిలో ముంచి వధువును అధీనము చేయును. ఈమెను మీకిచ్చుచున్నాను. ఈమెను ఆప్యాయముగా చూసుకొనండి. ఈ రీతిగా వరుని తల్లిదండ్రులు మొదలగువారికి వరుసగా వధువును కన్యాదాత అప్పగించును. మా పిల్లను ప్రేమతో కాపాడండి అని చెప్పుదురు.

ఇంకా ఉంది.



# హైందవ వివాహ పద్ధతి 28 వ భాగము.

## అనుబంధము : ప్రమాణ గ్రంధాలు.

1. పాణిగ్రహణము. వివాహ మంత్రార్ధము రచయిత శ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రి గారు. ప్రచురణ వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 26 రామానుజ అయ్యర్ వీధి, చెన్నై 600021.

2. శ్రీ ఆపస్తమ్బీయ పఞ్చాదశ కర్మానుక్రమణిక,
గ్రంధకర్త కీ. శే. భారతులాన్వయ శేషావధానభిః
దివాకర్ల పబ్లికేషన్స్, శంకర మఠము,
న్యూనల్లకుంట , హైదరాబాద్ 500044

3. హిందూ వివాహ ప్రాశస్త్యము
కూర్పు, ప్రచురణ విశ్వ హిందూ పరిషత్, ఆం. ప్ర.
శ్రీ జొన్నలగడ్డ సుబ్బావధాని , ఎం. డి. సింగరేణి కాలరీస్ సూపర్ బజార్ దంపతులు తమ కుమార్తె వివాహ సందర్భములో ప్రచురించినది.

4. సంస్కార రత్నాకరః (పూర్వ భాగః)
"సాఙ్గస్వాధ్యాయ భాస్కర" సన్నిధానం
లక్ష్మీ నారాయణ మూర్తి శర్మణా సఙ్గ్రదితః

శుభం - భూయాత్